**శ్రీః**

**శ్రీవేదవ్యాస మహర్షి ప్రణీతము**

# శ్రీ శివ మహా పురాణము

**ఆంధ్రానువాద సహితము**

**(ద్వితీయ సంపుటము)**


**అనువాదకులు:**

## స్వామి తత్త్వవిదానంద సరస్వతి

**బ్రహ్మవిద్యా కుటీర్**

**1 - 3 - 93, పాత అల్వాల్,**

**సికింద్రాబాద్.**



**ప్రకాశకులు:**

## శ్రీ వేంకటేశ్వర ఆర్ష భారతి ట్రస్ట్

**గురుకృప**

**1 - 10 - 140/1, అశోక్ నగర్, హైదరాబాదు - 500 020.**





ప్రథమ ముద్రణము

1999

ప్రతులు: 1000 మూల్యము: రూ. 100.00

ఇంటింట దేవతా మందిరములందు పూజింపవలసినవి,

ఆడపడుచులు అత్తవారింటికి వెళ్లునపుడు సారె పెట్టవలసినవి,

ఆచంద్రార్కము మనుమల మునిమనుమల ఆయురారోగ్య భాగ్య సౌభాగ్య

సమృద్ధికి ధర్మము ధనము భోగము మోక్షము కోరి చదివి చదివించి

విని వినిపించవలసినవి, వేద వేదాంత రహస్య సుబోధకములైనవి,

వ్యాసప్రోక్త అష్టాదశ (12) మహాపురాణములు.

వానిని సంస్కృతమూల - సరళాంధ్రానువాద - పరిశోధనలతో

శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్టు ముద్రించి

అందించుచున్నది.

ప్రతులకు: ముద్రణ:

శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్టు కె.యస్. లత ఆఫ్ సెట్ ప్రింటర్స్,

గురుకృప సూల్తాన్ బజార్,

1 - 10 - 140/1, అశోక్ నగర్, కోఠి, హైదరాబాదు.

హైదరాబాదు - 500 020. ఫోన్: 4754907

**శ్రీ గణ   శాయ నమః**

పరమ పూజనీయ బ్రహ్మవిద్యాచార్య శ్రీశ్రీశ్రీ స్వామి దయానంద సరస్వతీ మహారాజుల కృపాదృష్టి నాపై ప్రసరించుటచే, Dr.రాణి రామకృష్ణగా ఉండిన నేను స్వామి తత్త్వ విదానంద సరస్వతిని అయితిని. నాకు పితృతుల్యులు, మహావిద్వాంసులు అగు శ్రీDr.పుల్లెల శ్రీరామ చంద్రుడు గారు నాపై పుత్రవాత్సల్యమును

చూపి శివపురాణమును తెనిగించుమని ఆదేశించిరి. నేను బాల్యములో బ్రహ్మర్షులు, రాష్ట్రపతి సమ్మాన గ్రహీతలు, అభినవ పాణిని అగు కొంపెల్ల సుబ్బరాయ శాస్త్రి గారి వద్ద, మా నాయనగారు వేదాంత శిరోమణి బ్రహ్మ శ్రీ రాణి నరసింహ శాస్త్రి గారి వద్ద నేర్చుకున్న సంస్కృతము ఇందులకు అక్కరకు వచ్చి సార్థకమైనది. ప్రాతస్స్మరణీయులగు వీరందరికీ నా సాష్టాంగ ప్రణామములు.

పురాణములలో కానవచ్చు ప్రతిశ్లోకము వ్యాసప్రోక్తమే ననుట సందేహాస్పదము. భాష, శైలి, విషయము అను మూడు అంశములను దృష్టిలో నిడుకొని చూచినచో మనకీ విషయము స్పష్టమగును. అయా కాలములలో ఎందరో పండితులు, మరియు అపండితులు పురాణవాఙ్మయములోనికి ప్రవేశించి తమ విశ్వాసములకు అనుగుణముగా శ్లోకములను రచించి పురాణములలో నిక్షేపించి నట్లు కనబడుచున్నది. అవి అన్నియు వ్యాసుని పేర చెలామణీ అగుచున్నవి. ఈ పరిస్థితి శివపురాణములో మరింత తీవ్రంగా నున్నది. విష్ణు, మత్స్యాది పురాణములు కల్తీ లేకుండా శుద్ధముగా నుండగా, మధ్యయుగములో చెలరేగిన వైష్ణవశైవ విద్వేషముల ప్రభావము శివపురాణములో సుస్పష్టముగా గోచరించును. ఏదేవతను వర్ణించే పురాణములో ఆ దేవతయే సర్వోపరి వర్ణింప బడుట వ్యాసుని రచనా శైలి యను పండితుల అభిప్రాయమును ఎరింగియే నేను ఈమాటను చెప్పుచున్నాను. ఈ సమస్యలకు తోడుగా లేఖకుల దోషములు అంసంఖ్యాకములుగా నుండి ఈ వాఙ్మయములో పలు మార్పులను తీసుకొని వచ్చినవి. నేను నా చిన్న అనుభవములో ఒక సంగతిని గ్రహించితిని. పండితులు వ్రాయరు. లేఖకులకు చూచి వ్రాతను మించి ఏమీ తెలియదు. ఈ పరిస్థితి అనేక తరములు కొదసాగినది. తత్ఫలితముగా పురాణములలో అనేక దోషములు చోటు చేసుకున్నవి. ఈ గుడ్డు పరిస్థితిలో నేను చెతనైనంత శ్రమించి శివపురాణము పేరుతో లభ్యమగుచున్న గ్రంథమును తెనిగించితిని. అనేక శ్లోకములలో కొరుకుడు పడని భాష, సందర్భశుద్ధి కొరవడుట

మరియు అశ్లీలవర్ణనములు కూడ గలవు. మోతీలాల్ బనారసీ దాస్ అను సంస్థవారు ప్రచురించిన ఇంగ్లీషు భాషలోని శివపురాణము ఈ అనువాదములో తోడ్పడినది.

అస్తికవరేణ్యులగు శ్రీ P.వెంకటేశ్వర్లు గారు ఈ గ్రంథమును ముద్రించిరి. మిత్రులు శ్రీ J.A. శాస్త్రిగారు ముద్రణ బాధ్యతను సమర్థముగా నిర్వహించిరి. వారికి నా కృతజ్ఞతలు. పైన వివరించిన అనేక కారణములచే ఈ అనువాదములో దోషములుండుటలో అశ్చర్యము లేదు. పండితులు నాకు తెలిపినచో, రెండవ ముద్రణలో సవరించెనదను. భారతదేశములో మాత్రమే గాక, ఇతర దేశములలో కూడా శివభక్తి వ్యాప్తమగుటలో ఈ గ్రంథము దోహదము చేయుగాక యని ఆ పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

భాగ్యనగరము ఇట్లు, బుధ జన విధేయుడు

8.8.1999. **స్వామి తత్త్వ విదానంద సరస్వతి**

## శ్రీః

## ఉపోద్ఘాతము

శ్రీ శివమహాపురాణం దాదాపు 26,000 శ్లోకాల గ్రంథం. దీనిలో ఏడు సంహితలు ఉన్నాయి. మొదటి సంహిత విద్యేశ్వర సంహిత. దీనిలో 25 అధ్యాయాలు ఉన్నాయి. రెండవదైన రుద్రసంహిత-సృష్టిఖండం, సతీఖండం, పార్వతీ ఖండం, కుమారఖండం, యుద్ధఖండం అనే ఐదు ఖండాలుగా విభక్తమై ఉన్నది. ఈ ఖండాలలో వరుసగా 20, 43, 55, 20, 59 అధ్యాయాలున్నాయి. శతరుద్రసంహిత అనే మూడవ సంహితలో 42 అధ్యాయాలు, నాల్గవదైన కోటిరుద్రసంహితలో 43 అధ్యాయాలు, ఐదవదైన ఉమాసంహితలో 51 ఆధ్యాయాలు, ఆరవదైనకైలాస సంహితలో 23 అంధ్యాయాలు ఉన్నాయి. రెండు భాగాలుగా విభక్తమైన వాయవీయసంహితలో వరుసగా 35, 41 అధ్యాయాలు ఉన్నాయి. శైవదార్శనిక సిద్ధాంతాలు, అనేక

ఉపాఖ్యానాలు, తత్తద్దేవతారాధనవిధానాలు అతివిస్తృతంగా వర్ణింపబడి ఉన్న ఈ మహాపురాణం శైవసంప్రదాయానికి సంబంధించిన విజ్ఞానసర్వస్వం అని చెప్ప వచ్చును.

శ్రీ స్వామి తత్త్వవిదానందసరస్వతి రచించిన ఆంధ్రానువాదంతో ఈ మహాపురాణం ద్వితీయ సంపుటం పఠితలకు అందజేస్తూన్నందుకు సంతోషిస్తున్నాము. పూర్వాశ్రమంలో డా||రాణి రామకృష్ణ అనే పేరుతో ప్రసిద్ధులైన అనువాదకులు భారతీయ సంస్కృతి ప్రచారబద్ధ దీక్షులు. చిన్నతనంలో వేదాధ్యయనం చేసి రసాయనశాస్త్రంలో యమ్. యస్. సి పిహెచ్.డి . పట్టాలు, సంస్కృతంలో యమ్. ఏ., పిహెచ్. డి పట్టాలు తీసికొని అటు వైజ్ఞానిక రంగంలోను ఇటు భారతీయ సాంస్కృతిక రంగంలోను నిరుపమానమైన ప్రజ్ఞ సంపాదించినవారు. ఈ పురాణానికి ప్రామాణికమైన చక్కని అనువాదం అందజేసినందుకు వారికి కృతజ్ఞత తెలుపుతూ వారి సహాయంతో మిగిలిన రెండు సంపుటాలు కూడ అనతిచిరకాలంలో వెలువరించగలమని ఆశిస్తున్నాం.

**శ్రీ వెంకటేశ్వర అర్ష భారతీ ట్రస్టు**